# ప్రణవ స్తోత్రము




సంస్కృత మూలం :

**పండిత విశ్వమిత్ర జీ**

సంకలనం :

**సుమూర్తి**

(డా॥ కోడూరి సుబ్బారావు)



ఓమ్

## పరమేశ్వర ఉవాచ:

ఉద్యానం తే పురుష నావయానం
జీవాతుం తే దక్షతాతిం కృణోమి ।
ఆ హి రోహేమ మమృతం సుఖం రథమ్
అథ జిర్వి విదథమా వదాసి ॥ (అథర్వవేదం. 8-1-6)

ఓ మానవా ! ఉత్తమ కర్మల నాచరించి ఉన్నతిని పొందుము. అధమ కర్మల నాచరించి అవనతిని పొందవద్దు. నేను నీకు జీవితాన్ని, దక్షతను ప్రసాదిస్తున్నాను. ఈ ఉత్తమ సుఖకారక మానవ శరీరాన్ని అధిరోహించి అమరత్వాన్ని పొందు. యజ్ఞమయ జీవితంతో వృద్ధుడవై నీ అనుభవాలను తోటి మానవుల కందించి ఆదర్శ పురుషుడవు కమ్ము.

O Man! Make progresses, don't regress. I give you both vitality and energy. Ride on the chariot of human body, which is Joyful and a cause of Immortality. preach knowledge and wisdom till the end of life.

# ప్రణవ స్తోత్రము




సంస్కృత మూలం :

**పండిత విశ్వమిత్ర జీ**

సంకలనం :

సుమ్నార్థి

(డా॥ కోడూరి సుబ్బారావు)

ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు**

గాయత్రీ గ్రంథమాల : 51

**ప్రణవ స్తోత్రము**

ద్వితీయ ముద్రణ ప్రతులు : 1000



సృష్టిసంవత్సరము : 196, 08, 53, 112 (మన్వంతర సంధి రహితము)
197, 29, 49, 112 (మన్వంతర సంధి సహితము)

విక్రమాబ్దము : 2068

కలియుగాబ్దము : 188.

శ్రీ ఖర నామ సం॥ర బాధ్రపద శు॥ చవితి (1-8-2011)

**మూల్యము : రూ. 10=00.**

(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (B.O.) ; (Via.) భువనగిరి - 508 116.
సెల్ : 9290604641.

2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, ఆర్యసమాజము,
12-10-586/6, వారాసిగూడ, సీతాఫలమండి,
సికింద్రాబాద్ - 500 061.

3. ఆర్యసమాజము, మెయిన్‌రోడ్డు, సీతాఫలమండి - 500 061.

4. శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం. 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్.
ఫోన్ : 040-6632 0300.

5. శ్రీ విద్యా బుక్ డిపో మరియు గోపాల్ బుక్ హౌస్,
ఆర్యసమాజము ఎదురుగా, సుల్తాన్‌బజార్, హైదరాబాద్.

6. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.

*Printed at :*

**PRINTSHOP** - 6632 0300.



# ప్రణవ స్తోత్రము

ఇంద్రం మిత్రం వరుణమగ్ని మాహురథో దివ్యస్స సుపర్ణో గరుత్మాన్।
ఏకం సత్ విప్రా బహుధా వదన్తి అగ్ని యమం మాతరిశ్వాన మాహుః

- ఋగ్వేదం (1-64-46)

పరమేశ్వరుడు ఒకే ఒకడు. అతనినే విప్రులు (జ్ఞానులు) బహునామాలతో పిలుస్తారని వేదం చెబుతుంది. అంటే- పరమేశ్వరుడే స్వయంగా ఈ మాట చెబుతున్నాడు. కొన్ని నామాలు అతని గొప్ప గుణాలను చెబితే, కొన్ని అతని శక్తి సామర్థ్యాలను చెబుతాయి. మరికొన్ని ఆయన ప్రేమ దయ కరుణాది స్వరూప స్వభావాలను తెలుపుతాయి. కాని, లోకంలో నామాని కొక రూపాన్ని కల్పించి పూజలు వ్రతాలు భజనలు సంకీర్తనలు చేస్తున్నారు. వీటివల్ల పరమేశ్వరుని స్వరూప స్వభావాలు తెలియకుండా పోయాయి. ఈ లోపాన్ని సరిచేయటానికి కీ.శే. పండిత విశ్వమిత్రజీ సంస్కృతంలో ఒక చక్కటి సంకీర్తన వ్రాశారు. ఆయన కీర్తించిన సుగుణాలన్నీ 'ఓమ్' నామక ఏకేశ్వరునకే చెందుతాయనే భావం ఆ కీర్తనలో స్పష్టంగా ఉంది. దానిని తెలుగు భక్తుల కందించాలనే సద్భావనతో లిపిని తెలుగుగా మార్చి ప్రచురిస్తున్నాము. పదములన్నీ చాలా వరకు సుబోధకముగానే ఉన్నాయి. అయినప్పటికి సంక్షిప్త భావం కోష్టకాలలో (బ్రాకెట్స్‌లో) వ్రాస్తున్నాము.

సంకీర్తన మనను తన్మయులను చేసి ఆనందానుభూతిని కలిగిస్తుంది. భక్తులంతా ఆ మాధుర్యాన్ని ఆస్వాదించండి. (ఈ సంకీర్తన మహాత్మా గాంధీ గారికి అత్యంత ప్రియమైన సంకీర్తన 'రఘుపతి రాఘవ రాజారాం - పతిత పావన సీతారాం' బాణీలో (స్టైల్‌లో) ఉంది).

పల్లవి

**అనంత గుణగణ భూషిత ఓ3మ్ - శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**

వివరణ : పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు సర్వశక్తిమంతుడు సర్వజ్ఞుడు. ఎవరి సహాయం లేకుండానే తానొక్కడే సృష్టి స్థితి ప్రళయాలు చేస్తున్నాడు. జీవులమైన మనం మనోవాక్కాయాలతో చేసే సర్వకర్మలను తెలుసుకుంటూ అత్యంత న్యాయంగా ఫలాలనిస్తున్నాడు. అతని గుణగణాలు, శక్తి సామర్థ్యాలు అనంతం. అతడు శుద్ధుడు - అవిద్యా అజ్ఞాన అపవిత్రములు లేనివాడు. బ్రహ్మ - అన్నిటికన్న గొప్పవాడు. పరాత్పరుడు - శ్రేష్ఠులందరికన్న శ్రేష్ఠుడు. శ్రేష్ఠతముడు. అట్టి పరమేశ్వరుని ముఖ్యనామం (అసలు పేరు) ఓ3మ్. 'అవతీతి ఓ3మ్' అని చెప్పినట్లు అతడు జడ చేతన జగత్తునంతటిని రక్షించు సంరక్షకుడు (గార్డియన్). ఆ ఓ3మ్ నామమునకే మరొకపేరు ప్రణవము. అంటే విశేషంగా కీర్తించతగినది, స్మరించతగినది అని అర్థం.

---

**ఓ3మ్ ఇత్యేతద్ అక్షరం ఇదం సర్వం, తస్యోప వ్యాఖ్యానమ్ ।**
**భూతం భవద్ భవిష్యదితి సర్వమ్ ఓంకార ఏవ ।**
**యచ్చాన్యత్ త్రికాలాతీతం తదపి ఓంకార ఏవ ॥**

- మాండూక్యోపనిషత్తు (1-1)

ఈ సమస్త సృష్టి అక్షరుడైన (నాశరహితుడైన) పరమాత్మచే సృజింపబడి మరియు ధరింపబడి ఉంది. ఈ సృష్టి అంతా అతని ఉపవ్యాఖ్యానమే - అతని మహిమను తెలుపునదియే. భూత భవిష్యద్వర్తమాన కాలములలో సృజింపబడునది యంతయు ఆ ఓం నామక పరమేశ్వరుని వలననే. త్రికాలాతీతమై యుండునదియును ఓంకారనామక పరతత్త్వమే.

# ప్రణవ స్తోత్రము

**(రఘుపతి రాఘవ రాజారాం..... అనే బాణీలో)**

1. **అనంత గుణగణ భూషిత ఓ3మ్**
(అనంత గుణాలతో అలరారే ఓ ఆనంద స్వరూప పరమేశ్వర ! నీ ముఖ్యనామం (అసలు పేరు) ఓ3మ్. నీవు సర్వవ్యాపకుడవు. సర్వాంతర్యామివి. సర్వ సంరక్షకుడవు. దయచేసి నన్ను పాపకార్యాలు చేయకుండా కాపాడు)

2. **శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**
( ఓ శుద్ధుడా ! అందరికన్న గొప్పవాడా ! పరాత్పరా ! నన్ను రక్షించు)

3. **సబల బ్రహ్మ సునామక ఓ3మ్**
(సబలబ్రహ్మ మను మంచి నామము కలవాడా ! నన్ను రక్షించు)

4. **కాలాత్మక పరమేశ్వర ఓ3మ్**
(కాలనియామక పరమేశ్వర ! నన్ను కాపాడు)

5. **ప్రళయానంతర సుస్థిత ఓ3మ్**
(ప్రళయానంతరమునూ స్థిరముగా నుండువాడా ! ...)

6. **ఈక్షిత సృష్టి విధాయక ఓ3మ్**
(నీ ఈక్షణంతో (సంకల్పంతో) సృష్టినిచేయు దేవా ! ...)

7. **వ్యాపక యజ్ఞ ప్రసారక ఓ3మ్**
(వ్యాపక సృష్టియజ్ఞము చేయు ఓ దేవా !...)

8. **లోకాఖిల గతిదాయక ఓ3మ్**
(అఖిల లోకాలకు గతిని కలిగించు ఓ పరమేశ్వర !......)

9. **జగన్నియంతా పాలక ఓ3మ్**
(ఓ జగన్నియామక ! ఓ జగత్పాలకా ! ....)

10. **జనతా దుఃఖ ప్రభంజక ఓ3మ్**
(ఓ జనతా దుఃఖ నివారక పరమేశ్వర ! నన్ను రక్షించు)

11. **భక్తప్రియ సుఖదాయక ఓ3మ్**
(ఓ భక్తజన ప్రియా ! సుఖదాతా ! నన్ను రక్షించు)

12. **సూర్యాదిక ద్యుతి ధారక ఓ3మ్**
(సుర్యాది ప్రకాశ గోళాలకునూ ప్రకాశ దాతా ! ....)

13. **పరమ సహాయక ప్రియవర ఓ3మ్**
(ఓ పరమ సహాయకా ! వరింపతగిన ఓ శ్రేష్ఠుడా !...)

14. **నిత్యతృప్త సర్వాశ్రయ ఓ3మ్**
(ఓ నిత్య తృప్తుడా ! సర్వ చరాచర జగదాశ్రయ !...)

**అనంత గుణగణ భూషిత ఓ3మ్**
**శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**

15. **జ్ఞానరూప సత్ప్రేరక ఓ3మ్**
(ఓ జ్ఞాన స్వరూపుడా ! సత్కర్మలలో ప్రేరుపించు ఓ దేవా ! ..)

16. **సకల ద్రవ్య వ్యాపక ఓ3మ్**
(సకల ద్రవ్యాలలోనూ (పదార్థాలలోనూ) వ్యాపించియున్న వాడా!)

17. **శ్రోత్రాదీంద్రియ శక్తిద ఓ3మ్**
(శ్రోత్రాది జ్ఞాన కర్మేంద్రియాలన్నిటికీ శక్తినిచ్చు ఓ రక్షకా!....)

18. **కర్మాశ్రిత ఫలదాయక ఓ3మ్**
(కర్మలను బట్టి న్యాయముగా ఫలముల నిచ్చువాడా !...... )

19. **అద్భుత తేజో బలయుత ఓ3మ్**
(అద్భుతమైన తేజస్సు, బలము కలవాడా !........)

20. **శ్రేయఃప్రాప్తి సుసాధక ఓ3మ్**
(మోక్ష ప్రాప్తిని సుగమము చేయువాడా !.....)

21. **హర్షిత మతి సంధాయక ఓ3మ్**
(మనస్సుకు సంతోషము నిచ్చువాడా !... )

22. **మాతృప్రేమ పరిపోషక ఓ3మ్**
(తల్లివలె ప్రేమతో చక్కగా పోషించువాడా ! నన్ను రక్షించు)

23. **స్నేహార్ద్రిత పితృపాలక ఓ3మ్**
(స్నేహ సంతోషాలతో తండ్రివలె పాలించువాడా !...నన్ను కాపాడు)

24. **వ్యాహృతి లోక విభాజక ఓ3మ్**
(విశాలమైన విశ్వాన్ని లోకాలుగా విభజించువాడా!..)

25. **సకల బుద్ధి సిద్ధిప్రద ఓ3మ్**
(సకల జ్ఞాన విజ్ఞాన ప్రదాతా! ఓ దేవా !...)

26. **వేద చతుష్టయ దాయక ఓ3మ్**
(ఓ చతుర్వేద ప్రదాతా ! పరమేశ్వర !.....)

**అనంత గుణగణ భూషిత ఓ3మ్**

**శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**

27. **అగ్న్యాదిక ఋషి పూజిత ఓ3మ్**
(అగ్ని వాయు ఆదిత్య అంగిరసు లను ఆది ఋషులచే
పూజింపబడినవాడా ! దేవాది దేవా ! ......)

28. **సాధన సాధ్య సముచ్చయ ఓ3మ్**
(మోక్ష మను సాధ్యమునకు తగిన సాధనములను సమకూర్చువాడా! .......)

29. **ప్రాణదక్ష సందాయక ఓ3మ్**
(దక్షతగల ప్రాణశక్తి నిచ్చువాడా !... )

30. **ఇంద్ర బృహస్పతి నామక ఓ3మ్**
(ఇంద్ర బృహస్పత్యాది అనేక నామములతో పిలువబడువాడా!..)

31. **ఋతుపరివర్తన కారణ ఓ3మ్**
(ఋతు పరివర్తన చక్రము నేర్పరచినవాడా !...)

32. **ఋతు మూలక హిత దాయక ఓ3మ్**
(ఋతువుల ద్వారా ప్రాణులకు మేలు చేయువాడా !...)

33. **జ్ఞానసూర్య విస్తారక ఓ3మ్**
(జ్ఞాన మనే సూర్యుని మా బుద్ధులలో వికసింపజేయువాడా !.....)

34. **సుర సంపూజిత సురవర ఓ3మ్**
(దేవతలచే వరింపబడి పూజింపబడేవాడా ! నన్ను రక్షించు)
35. **సత్సంకల్ప ప్రపూరక ఓ3మ్**
(మా సత్సంకల్పములను చక్కగా పూర్ణం చేయువాడా !...)
36. **ధర్మాధర్మ సుశిక్షక ఓ3మ్**
(ధర్మాధర్మముల జ్ఞానమును కలిగించు ఓ అంతర్యామీ !...)
37. **జన్మరహిత జన్మప్రద ఓ3మ్**
(నీవు జన్మరహితుడవై మాకు జన్మల నిచ్చువాడా !...)
38. **దేవాదిక ఋణమోచక ఓ3మ్**
(దానశీల విద్వాంసులను ఋణములనుండి విడిపించువాడా !)

**అనంత గుణగణ భూషిత ఓ3మ్**
**శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**

39. **క్లేశ విముక్త విశేషణ ఓ3మ్**
(అవిద్యాది క్లేశరహిత ! ఓ విశేష పురుషుడా !...)
40. **స్నాయు రహిత సుఖపూరక ఓ3మ్**
(నాడీ బంధన రహితా ! ఓ సుఖదాయక పరమేశ్వర !...)
41. **దైహిక రోగ నివారక ఓ3మ్**
(దేహ సంబంధ రోగాలను పోగొట్టువాడా! ఓ దేవా !...)
42. **తను పాలక దీర్ఘాయుద ఓ3మ్**
(మా శరీరాలను పాలించి పోషిస్తూ మాకు దీర్ఘాయువు నిచ్చువాడా!)
43. **ఆత్మికబల సందాయక ఓ3మ్**
(ఆత్మ బలమునిచ్చి కాపాడే ఓ రక్షకా!..)
44. **మానవ లక్ష్య మహాశ్రయ ఓ3మ్**
(మానవ జన్మకు పరమ లక్ష్యము, పరమాశ్రయమునైన ఓ దేవా!)

45. **నిత్య రిజంన నిరుపమ ఓ3మ్**

(నిత్యుడవు, నిరంజనుడవు, నిరుపముడవు నైన ఓ రక్షకా!..)

46. **భవభయ భంజన భేషజ ఓ3మ్**

(సంసారభయ భంజన ఔషధము గలవాడా ! అది నా కిమ్ము..)

47. **ఆర్తత్రాణ పరాయణ ఓ3మ్**

(ఆర్తులను, దుఃఖితులను రక్షించే ఓ దేవా ! నన్ను రక్షించు..)

48. **అజ్ఞానాదిక రిపుహర ఓ3మ్**

(అజ్ఞానాది శత్రునాశక ఓ భర్గా ! ఓ జ్ఞానతేజా ! ...)

49. **దారిద్ర్యాది వినాశక ఓ3మ్**

(దారిద్ర్యాది దుఃఖముల నశింపచేయువాడా ! ...)

50. **పరమైశ్వర్య సుదాయక ఓ3మ్**

(ఉత్తమోత్తమ ఐశ్వర్యాలనిచ్చే ఓ దేవా ! ....)

**అనంత గుణగణ భూషిత ఓ3మ్**

**శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**

51. **సర్వానంద సుసాధక ఓ3మ్**

(సర్వానంద ప్రదాతా ! సర్వేశ్వరా ! పాహిమాం, రక్షమాం)

52. **సామ్రాజ్యార్క ప్రసారక ఓ3మ్**

(ఆర్యసామ్రాజ్య సూర్యుని విస్తరింపజేయువాడా ! ...)

53. **విశ్వ వినోదక విభువర ఓ3మ్**

(సకల వినోదాలతో సృష్టిని చేసిన ఓ దేవా ! ...)

54. **సద్బోధిత హృద్వర్ధక ఓ3మ్**

(సత్య జ్ఞానమును కలిగించి హర్షింపజేయు ఓ దేవా !..)

55. **నిర్మల నాయక శర్మద ఓ3మ్**

(ఓ నిర్మలా ! ఉత్తమ నాయకా ! సుఖప్రదాతా !...)

56. **లోభాదిక రిపు నాశక ఓ3మ్**

(లోభమోహాది శత్రు నాశకా! ఓ దేవా !...పాహిమాం !)

57. **తేజః ప్రద తేజోమయ ఓ3మ్**

( ఓ తేజోమయ ! తేజ ప్రదాత ! మాకు నీ తేజస్సు నిమ్ము)

58. **ఓజః ప్రద ఓజోమయ ఓ3మ్**

(ఓ సర్వ సామర్థ్యయుక్తుడా ! మాకును ఓజస్సు నిమ్ము)

59. **శ్రద్ధాప్రద శ్రద్ధామయ ఓ3మ్**

(ఓ శ్రద్ధామయ ప్రభో ! మాకును తగిన శ్రద్ధను ప్రసాదింపుము)

60. **రసవాహక సర్వేశ్వర ఓ3మ్**

(సర్వ ప్రాణులకు రసప్రదాతవైన సర్వేశ్వర ! మాకును..)

61. **దాన సృష్టి సంచాలక ఓ3మ్**

(జీవులమైన మా కొరకు సృష్టిని దానముచేసి నడిపించు ప్రభో !..)

62. **రసభేదక సంవర్ధక ఓ3మ్**

(ఆహారమును రసరక్తాదులగా మార్చి వృద్ధిచేయు ఓ దేవా !..)

**అనంత గుణగణ భూషిత ఓ3మ్**

**శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**

63. **పాపనివారక మోక్షద ఓ3మ్**

(పాపములందు హెచ్చరించుచు మోక్షమువైపు నడిపించు ఓ అంతర్యామీ!)

64. **మృత్యురూప సంశోధక ఓ3మ్**

(వృద్ధులకు మృత్యువు ద్వారా పునర్జన్మనిచ్చు ఓ పరమపితా !...)

65. **చిత్ర విచిత్ర మహాతుథ ఓ3మ్**

(చిత్ర విచిత్ర సృష్టి సంచాలకా ! ఓ సర్వేశ్వర !....)

66. **సత్య సనాతన ధర్మద ఓ3మ్**

(సత్య సనాతన వైదిక ధర్మ ప్రబోధకా ! పరమేశ్వర ! ...)

67. **హోమార్పిత హవిభేదక ఓ3మ్**

(ఆహుతులను సూక్ష్మీకరించి వెదజల్లు ఓ యజ్ఞేశ్వర ! ...)

68. **సభ్యసభా ప్రతిభా ప్రియ ఓ3మ్**
(సభ్య సభాసదులకు ప్రియమైన ఓ దేవా ! .. రక్షమాం)
69. **విస్తృత శాంతి విధాయక ఓ3మ్**
(శాంతిని విస్తృత పరచు ఓ శాంతి దాతా ! ....)
70. **వరుణ ప్రజాపతి ప్రేరక ఓ3మ్**
(ఓ దేవా ! నీవు శ్రేష్ఠుడవు, ప్రజాపతివి, ప్రేరకుడవు....)
71. **స్థావర జంగమ రక్షక ఓ3మ్**
(స్థావర జంగమాత్మక సృష్టి రక్షకా ! ఓ దేవా ...)
72. **విద్వజ్జన మతి ప్రేరక ఓ3మ్**
(విద్వాంసుల బుద్ధులను ప్రేరేపించు ఓ సవితా దేవా !...)
73. **విక్రమ విష్ణు విరాడసి** ఓ3మ్
(ఓ దేవా! నీవు పరాక్రమవంతుడవు, వ్యాపకుడవు, విరాజిల్లువాడవు)
74. **దాన రహిత నరనాశక ఓ3మ్**
(దానము చేయని వారికి దుర్గతిని కలిగించు ఓ దేవా ! ..)

**అనంత గుణగణ భూషిత ఓ3మ్**
**శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**

75. **త్యాగయుక్త నర భద్రద ఓ3మ్**
(త్యాగము చేయువాడికి సుఖములనిచ్చు ఓ దేవా!...)
76. **మన్యురూప మన్యుప్రద ఓ3మ్**
(ఓ దేవా ! నీవు దుష్టులను దండించువాడవు. మమ్మును నీవలె చేయుము)
77. **వీర్యరూప వీర్యప్రద ఓ3మ్**
(ఓ దేవా ! నీవు అనంత పరాక్రమవంతుడవు. మమ్మును అట్లే చేయుము)
78. **సహనరూప సహదాయక ఓ3మ్**
(నీవు అత్యంత సహనశీలుడవు. నీ కృపవలన మేమును అట్లే అగుదుము గాక!)

79. **అచలరూప సంచాలక ఓ3మ్**
(ఓ దేవ ! నీవు చలించకనే నీ ఆధారముపై జగత్తును చలింపజేయు సర్వశక్తిమంతుడవు. పాహిమాం ! రక్షమాం ! )

80. **రుద్రభీమ భయవాహక ఓ3మ్**
(దుష్టులపట్ల నీవు రుద్రుడవు. భయంకరుడవు....)

81. **సజ్జన సమ్మత సౌఖ్యద ఓ3మ్**
(సజ్జనులకు వలయు సుఖములనిచ్చువాడవు ....)

82. **వర్ణ చతుష్టయ స్థాపక ఓ3మ్**
(గుణకర్మలనుబట్టి నాలుగు వర్ణముల నేర్పరచినవాడవు....)

83. **సర్వన్యూన సంపూరక ఓ3మ్**
(అన్ని కొరతలనుచక్కగా పూరించువాడవు....)

84. **విద్వేషాదిక భంజక ఓ3మ్**
(భక్తుల విద్వేషాలను పోగొట్టువాడవు....)

85. **సర్వమిత్ర సంపాదక ఓ3మ్**
(నీవు సర్వులకు మిత్రుడవే – మేలుచేసే వాడివే....)

86. **సృష్టి స్థితి లయ కారక ఓ3మ్**
(సృష్టి స్థితి లయములు మూటికీ నీవొక్కడవే కర్తవు....)

**అనంత గుణగణ భూషిత ఓ3మ్**
**శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**

87. **క్షోభరహిత నభ నామక ఓ3మ్**
(నీవు దుఃఖరహితుడవు 'ఆకాశ'మను పేరు కలవాడవు....)

88. **మంగళ మూల మయోభవ ఓ3మ్**
(మంగళమయుడవు, సుఖదాతువు....)

89. **శంకరరూప మయస్కర ఓ3మ్**
( ఓ కళ్యాణ స్వరూప ! కళ్యాణప్రదాత ! మమ్ము కరుణించు)

90. **సృష్టిమయా వసు రసవతి ఓ3మ్**
(సర్వ సంపదలతో కూడిన నీ సృష్టి రసవంతము - సుఖవంతము)
91. **సత్పథ ధర్మపురోహిత ఓ3మ్**
( నీ ఉపాసకులను ధర్మపథంలో నడిపించు ఓ దేవా !...)
92. **నాశనివారక స్వస్తిద ఓ3మ్**
(నీవు వినాశమునుండి తప్పించి స్వస్తిని కలిగించు అంతర్యామివి)
93. **సకల యజ్ఞ స్వీకారక ఓ3మ్**
(సకల పరోపకారాది యజ్ఞముల స్వీకరించువాడవు)
94. **ఉక్షిత రక్షక శిక్షక ఓ3మ్**
(దుష్ట శిక్షక ! శిష్ట రక్షక ! మమ్ము రక్షించు)
95. **విశ్వరూప విశ్వావసు ఓ3మ్**
(నీవు విశ్వరూపుడవు. సమస్త ఐశ్వర్యముల నిధివి)
96. **విశ్వమిత్ర వైశ్వానర ఓ3మ్**
(నీవు విశ్వానికంతటికి మిత్రడువు వైశ్వానరుడవు జఠరాగ్నివి)
97. **పుణ్య పురూతమ పూరుష ఓ3మ్**
( నీ కర్మలన్నియు పాపపుణ్య రహితములు. అన్నియు యజ్ఞమయములే)
98. **పాహి నిరంతర పూషణ ఓ3మ్**
(మమ్ము నిరంతరం రక్షించి పోషించువాడవు)

**అనంత గుణగణ భూషిత ఓ3మ్**
**శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**

99. **పాహి ప్రవాహణ ప్రభువర ఓ3మ్**
(ఓ ఆర్త రక్షకా ! ప్రభూ ! మమ్ము రక్షించు)
100. **అద్భుత మిత్ర కృపాకర ఓ3మ్**
(నీవు అద్భుత మిత్రుడవు, కృపాసాగరుడవు....)

101. **మిత్రరూప వ్రతపాలక ఓ3మ్**

(నీవు సదా స్నేహవ్రత పాలకుడవు. మమ్ము రక్షించు)

102. **నిశ్చిత మిత్ర నిరాశ్రయ ఓ3మ్**

( ఓ స్వామీ ! నిశ్చయముగా నీవే మిత్రుడవు. ఆశ్రయుడవు)

103. **అధమోద్ధారక చిన్మయ ఓ3మ్**

(పతితోద్ధారకుడవు, జ్ఞానమయుడవు)

104. **సత్య సుఖాత్మక సర్వద ఓ3మ్**

(సర్వదా సత్యసుఖ స్వరూపడవు)

105. **నిర్గుణరూప నిరామయ ఓ3మ్**

(ప్రకృతి గుణములు, జీవుల గుణములు లేని నిర్గుణుడవు. శరీరము గాని, వ్యాధులు గాని లేనివాడవు)

106. **ఆనందామృత వర్షక ఓ3మ్**

(సదా ఆనందామృతమును వర్షించువాడవు)

107. **గణనాయక గణపాలక ఓ3మ్**

(జీవ గణములకు నాయకుడవు, పోషకుడవు. మమ్ము రక్షించు)

108. **మర్మాచ్ఛాదక విభువర ఓ3మ్**

(సర్వప్రాణ సంరక్షకుడవు, సర్వవ్యాపకుడవు అట్టి నిన్ను సదా మేము నీ ముఖ్యనామమైన 'ఓ3మ్' నామముతో స్మరింతుము గాక. మమ్మనుగ్రహింపుము)

**అనంత గుణగణ భూషిత ఓ3మ్**

**శుద్ధ బ్రహ్మ పరాత్పర ఓ3మ్**

## అష్టోత్తర శతనామావళి-శ్లోకాలలో

ఓ3మ్ ఖం విశ్వేశ్వరం ప్రాణం కుబేరం పురుషం తథా,
సవితారం చ పృథివీం స్వరాజం సర్వవ్యాపినమ్. 1

భగవంతం సర్వశక్తిమంతం శేషం పితామహం,
నిర్గుణం సగుణం మిత్రం సుపర్ణం శంకరం కవిమ్. 2

శం సత్యం చ మహాదేవం స్వప్రకాశ మురుక్రమం,
కాలాగ్నిం మాతరిశ్వానం భూమిం పరమపూరుషమ్. 3

విరాజం నిత్య మాప్తం చార్యమణం చ నిరంజనం,
ధాతారం విశ్వ స్రష్టారం పోషకం లయకారకమ్. 4

జ్ఞానానందమయం దేవం నిర్వికారం దయానిధిం,
న్యాయకారిణ మాత్మానం విష్ణు మద్వైత మీశ్వరమ్. 5

శివం దివ్యం చ బ్రహ్మాణం చిత్రగుప్తం యమం ప్రియం,
అజం హిరణ్యగర్భం చానాదిం చ ప్రపితామహమ్. 6

పరమాత్మాన మన్నాదం రుద్ర మిద్రం వసుం జలం,
సూర్యం చంద్రం మంగళం చ రాహుం కేతుం శనైశ్చరమ్. 7

బుధం బృహస్పతిం బంధుం పితరం మాతరం తథా,
ఆచార్యం శక్తిం కూటస్థం నిరాకారం ప్రజాపతిమ్. 8

విశ్వంభరం శుద్ధబుద్ధం ముక్తం శుక్రం సరస్వతీం,
ధర్మరాజం మనుం లక్ష్మీం దేవీం చ పరమేశ్వరమ్. 9

ఆకాశం చ శ్రియం కాలం వరుణం చ గణాధిపం,
గురుం నారాయణం యజ్ఞం హోతారం ప్రాజ్ఞ మక్షరమ్. 10

ఆదిత్యం తైజసం వాయు మగ్నిం చాపి స్వయంభువం,
అవ్యయం ధ్యానమార్గేణ గంతవ్యం నాన్యథాऽలభమ్. 11

ఇంద్రియాణి సుసంయమ్య కృత్వా చ స్థిమితం మనః,
జాన్మది బంధమోక్షార్థం ధ్యాయే జ్ఞానసమృద్ధయే ॥ 12

## సర్వవ్యాపక ఏకేశ్వరుని 108 నామములు

**(ధాత్వర్థములతో - Root Meanings తో)**

1. **ఓ3మ్** ఇది అతని ముఖ్యనామము (సర్వ సంరక్షకుడు), 2. **భూః** (సత్ స్వరూపుడు), 3. **భువః** (చిత్ స్వరూపుడు), 4. స్వః (ఆనంద స్వరూపుడు) 5. **ఇంద్రః** (ఐశ్వర్యవంతుడు), 6. **మిత్రః** (అందరకు స్నేహితుడు) 7. **వరుణః** (వరింపదగినవాడు),8. **అగ్నిః** (జ్ఞాన ప్రకాశము), 9. **దివ్యః** (దివ్య ప్రకాశము), 10. **సుపర్ణః** (జ్ఞానకర్మ లను రెక్కలు గలవాడు), 11. **గరుత్మాన్** (గొప్ప ఆత్మ, విశ్వాత్మ),12. **యమః** (సర్వనియామకుడు), 13. **మాతరిశ్వానః** (వాయుబలుడు), 14. **బ్రహ్మా** (అన్నిటికన్న గొప్పవాడు), 15. **విష్ణుః** (సర్వవ్యాపకుడు),16. **ఈశ్వరః** (పరమైశ్వర్యవంతుడు), 17. **గణపతిః** (జీవగణములకు పతి పాలకుడు), 18. **విశ్వంభరః** (విశ్వపోషకుడు), 19. **బృహస్పతిః** (గొప్పపతి - పాలకుడు) 20. **సూర్యః** (స్వయం ప్రకాశకుడు), 21. **చంద్రః** (ఆహ్లాద దాత) 22. **భూమిః** (విశ్వానికి భూమి-ఆధారం), 23. **పృథివీ** (జగత్ విస్తారకుడు), 24. **మంగళః** (సర్వులకు మేలు చేయువాడు), 25. **బుధః** (బోధకుడు), 26. **గురుః** (సకల విద్యాగురువు), 27. **శుక్రః** (పవిత్రపరచువాడు), 28. **శనైశ్చరః** (దుఃఖనాశకుడు), 29. **రాహుః** (దోషరహితుడు), 30. **కేతుః** (రోగ (దోష) నాశకుడు), 31. **ఆత్మా** (విశ్వవ్యాపకుడు), 32. **పరమాత్మా** (జీవులలోనూ వ్యాపించియున్నవాడు), 33. **పరమేశ్వరః** (సమర్థులలో గొప్ప సమర్థుడు), 34. **ఆచార్యః** (సదాచార బోధకుడు), 35. **సగుణః** (సర్వ సద్గుణవంతుడు), 36. **నిర్గుణః** (జీవ ప్రకృతుల గుణములు లేనివాడు), 37. **సత్** (త్రికాలలోనూ ఏకరసుడు), 38. **చిత్** (అనంత జ్ఞాన సామర్థ్యయుక్తుడు), 39. **ఆనందః** (ఆనందస్వరూపుడు, ఆనందదాత), 40. **సవితా** (అంతర్యామియై ప్రేరేపకుడు, సృష్టికర్త), 41. **దేవః**, దేవీ (దివ్యగుణయక్తుడు), 42. **భగవాన్** (సమగ్ర ఐశ్వర్యయుక్తుడు), 43. **నిరాకారః** (ఆకారము లేనివాడు), 44. **నిరంజనః** (దుష్టవాంఛారహితుడు), 45. **విశ్వేశ్వరః** (విశ్వాధిష్ఠాత), 46. **లక్ష్మీః** (సర్వైశ్వర్య కర్త), 47. **సరస్వతీ** (సమస్త జ్ఞాననిధి), 48. **శక్తిః** (ఏకైక జగత్కర్త), 49. **శ్రీః** (సేవించతగినవాడు), 50. **సర్వశక్తిమంతః** (సర్వ శక్తిమంతుడు), 51. **అనాదిః** (ఆది (కారణము) లేనివాడు), 52. **అనంతః** (అంతము లేనివాడు), 53. **అంతర్యామీ** (లోపలుండి నియమించువాడు), 54. **ఆప్తః** (మనందరి మేలుకోరువాడు), 55. **న్యాయకారి**

(న్యాయం చేయువాడు), 56. **దయాళుః** (దయానిధి), 57. **కాలః** (కాలము సమీపింపజేయువాడు), 58. **శేషః** (ప్రళయానంతరం ఉండువాడు), 59. **మహాదేవః** (దేవతలందరికి దేవుడు), 60. **విరాట్** (విశ్వ ప్రకాశకుడు) 61. **వాయుః** (గతి దాయకుడు), 62. **విశ్వః** (విశ్వవ్యాపకుడు), 63. **హిరణ్యగర్భః** (విశ్వగర్భుడు), 64. **తైజసః** (ప్రకాశాకులకు ప్రకాశము 65. **అక్షరః** (నాశనముకానివాడు), 66. **స్వరాట్** (స్వయం ప్రకాశకుడు), 67. **కాలాగ్నిః** (కాలానికిని కాలుడు), 68. **దివ్యః** (దివ్యులలో దివ్యుడు), 69. **ఆదిత్యః** (నాశరహితుడు), 70. **ప్రాజ్ఞః** (యథార్థ దర్శి), 71. **అర్యమా** (న్యాయకారి) 72. **ఉరుక్రమః** (అనంత పరాక్రమ యుక్తుడు), 73. **కుబేరః** (అన్నిటిని కప్పియుండువాడు), 74. **జలమ్** (దుష్ట దమనకారి), 75. **ఆకాశః** (దివ్య ప్రకాశకుడు), 76. **అన్నమ్** (అన్నదాత), 77. **వసుః** (అన్నిటిని తనయందు వశింపజేయువాడు), 78. **యజ్ఞః** (సృష్టియజ్ఞకర్త), 79. **హోతా** (కర్మఫలదాత), 80. **బంధుః** (బంధించువాడు), 81. **మాతా** (తల్లివంటివాడు), 82. **పితా** (తండ్రివంటివాడు), 83. **పితామహః** (తాతవంటివాడు), 84. **ప్రపితామహః** (ముత్తాత వంటివాడు), 85. **అజః** (జన్మనెత్తనివాడు), 86. **నిత్యః** (ఎప్పటికి ఉండువాడు), 87. **శుద్ధః** (దోషరహితుడు), 88. **బుద్ధః** (సర్వజ్ఞాత), 89. **ముక్తః** (సదాముక్తుడు), 90. **కూటస్థః** (సర్వములో వ్యాపకుడు), 91. **అద్వైతమ్** (అతనితో సమానుడు లేడు), 92. **నారాయణః** (వ్యాపకుడు), 93. **ధర్మరాజః** (సదా ధర్మ ప్రకాశకుడు), 94. **మనుః** (జ్ఞాన స్వరూపుడు), 95. **పురుషః** (బ్రహ్మాండ పురవాసి), 96. **ప్రియః** (సర్వులకు ప్రియుడు), 97. **ప్రజాపతిః** (జీవుల పాలకుడు), 98. **విశ్వకర్మా** (విశ్వకర్త - సృష్టికర్త), 99. **కవిః** (వేద రచయిత), 100. **ప్రాణః** (ప్రాణదాత), 101. **వైశ్వకర్మణః** (విశ్వ గతిదాత) 102. **శంకరః** (మేలుచేయువాడు), 103. **శివః** (మంగళస్వరూపుడు), 104. **స్వయంభూః** (స్వయంగా ఉండువాడు), 105. **పరిభూః**(అన్నిటిని కప్పియుండువాడు), 106. **అకాయః** (శరీరాలు లేనివాడు), 107. **అవ్రణః** (ఛిద్రరహితుడు), 108. **అస్నావిరః** (నాడీ బంధనములోనికి రానివాడు - జన్మించనివాడు).

ఇంతేగాక, వేదాలలో ఏకేశ్వరునికి అపాపవిద్ధుడు, మనీషీ, వశీ, స్కంభుడు, అన్నపతి, జనితా, విధాతా, త్ర్యంబకః, **జాతవేదః** మున్నగు అనేక నామము లున్నాయి. ఆ ఒక్కొక్కపేరు ఒక్కొక్క **గుణాన్ని** చెబుతాయి.

# కఠోపనిషత్తులో యమాచార్యుని ఉపదేశం
# 'ఓ3మ్'నామ జప విశిష్టత

**శ్లో॥ సర్వే వేదా యత్ పద మామనంతి ।**
**తపాంసి సర్వాణి చ యద్ వదంతి ।**
**యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి ।**
**తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి ఓ3మ్ ఇత్యేతత్ ॥**

ఋగ్వేదాది చతుర్వేదాలు దేనిని పొందదగినదిగా పలుమార్లు బోధిస్తున్నాయో, తపస్వులందరు దేనిని గురించి గొప్పగా చెప్పుచున్నారో, దేనిని పొందగోరుచూ ముముక్షువులు బ్రహ్మచర్యాన్ని పాటిస్తారో దానిని నీకు సంగ్రహంగా చెప్పుచున్నాను – ఓ నచికేతా ! అది 'ఓ3మ్' నామక పరమపదము.

**శ్లో॥ ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతదేవాక్షరం పరమ్ ।**
**ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో య దిచ్ఛతి తస్యతత్ ॥**

ఓ3మ్ అను పదముచే చెప్పబడెడు పరమాత్మతత్వం నాశనం లేనిది. అన్నిటికన్న గొప్పది. అన్నిటికన్న సూక్ష్మమైనది కూడా. అట్టి పదమును సరిగా ఉన్నది యున్నట్లుగా తెలుసుకొని ఉపాసించేవారు తాము సంకల్పించినది పొందగలరు.

**శ్లో॥ ఏత దాలంబనం శ్రేష్ఠమ్ ఏత దాలంబనం పరమ్ ।**
**ఏత దాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే॥**

ఈ 'ఓ3మ్' నామక ఆలంబనమే శ్రేష్ఠమైనది. అదియే ఉత్కృష్టమైనది. దానిని తెలిసికొని ధ్యానించువాడే బ్రహ్మ సాక్షాత్కారము నొంది ఆనందమగ్నుడు కాగలడు.

– కఠోపనిషత్తు (2–15, 16, 17)

## ఓంకారా ! సదాధారా ! దేవా ! సర్వాధారా!

(గున్న మామిడి కొమ్మ మీద....)

రచన : ఆర్షకవి : శ్రీ ప్రణవ కుమార

ఓంకారా ! సదాధార ! దేవా ! సర్వాధారా ||ఓంకారా||
నిను పాడితిమీ మా మనసారా !
మా మొర వినుమా ! నిరాకారా ! ||ఓంకారా||

అణువు కంటె సూక్ష్మమువాడా ! ఆకసమును మించినవాడా !
ఇంద్రియములు లేనివాడా ! సర్వేంద్రియ శక్తులవాడా !
విరులు ఝురులు గిరులూ తరులు సూర్యచంద్ర నక్షత్రములు
నీయందుననే నిండినవాడా ! నిఖిల సత్యగుణ సాంద్ర ! భవహరా ! ఆ...
||ఓంకారా||

కాగితముగ పృథివిని మార్చి కలముగ వృక్షములను కూర్చి
సిరగా ఈ సముద్రములను చేసి యెంత వ్రాసినను
నీ అనంతమగు గుణములను వ్రాయజాలగాలేము ప్రభూ !
ఒక్కడవే దేవుడవగు నిన్ను పెక్కు పేర్లతో పిలుతు మీశ్వరా ! ఆ ||ఓంకారా||

అనిత్యమున నిత్యపు జ్ఞానం అశుచి యందు శుచి యను భావం
దుఃఖమునే సుఖమనుకొనుట శరీరమును ఆత్మగ కనుట
అవిద్య యనగా ఇదియె కదా ! ఈ యవిద్యలో మునిగి సదా
నిన్ను మరచితిమి ఇంతవరకు ఇక నిజము తెలిసితిమి హే దయాకరా !
||ఓంకారా||

ఈ యవిద్యయే మాలోన రాగద్వేషముల పుట్టించె
రాగద్వేషములే మాచేత పాప పుణ్యముల చేయించె
పాప పుణ్యములె మమ్ములను జన్మబంధమున పడవేసే
జన్మబంధమే మమ్ము దుర్భరపు దుఃఖవారిధిని ముంచె దేవరా ! ఆ..
||ఓంకారా||

దుఃఖ వారిధిని దాటుటకు జన్మబంధనము తొలగుటకు
దుష్కర్మలు క్షీణించుటకు రాగాదులు నశియించుటకు
మిథ్యా జ్ఞానము పోవుటకు మోక్షానందము పొందుటకు
నిత్యానిత్యపు వస్తు వివేకము సత్యజ్ఞానమును ఇమ్ము శుభకరా ! ఆ...
||ఓంకారా||

## ఓమే వరం మనోహరం

(జానే కహా గయే ఓ దిన్)

రచన : ఆర్షకవి : శ్రీ ప్రణవ కుమార

ఓమే వరం మనోహరం
ఓమే హితం మహోన్నతం
ఓ మనియె స్మరియంతు సంతతం

ఓమే పరం శుభంకరం
ఓమే ప్రియం సుఖాలయం
ఓ మనియె స్మరియింతు సంతతం ॥ఓమే॥

ఓమే తపోలోక జీవనం
ఓమే త్రయీలోక పావనం
ఓమే అఖిల సృష్టి కారణం
ఓమే సకల దుఃఖ హారణం ॥ఓమే వరం॥

ఆ రామకృష్ణాది ఆర్యులు
ఆ వ్యాస వాల్మీకి వర్యులు
కోటాను కోట్ల ఋషీంద్రులు
ఈ నామమే తలచిరీ సతం ॥ఓమే॥

సర్వేశ్వరుని నామ కోటిలో
సర్వోత్తమము ఓమ్ నామము
ఈశ్వరుని గుణకర్మ స్వభావము
లన్నింటి సంక్షిప్త రూపము ॥ఓమే వరం॥

దేహమునకే కాదు భోజనం
ఆత్మకును కావలయు భోజనం
ఓంకార మంత్రార్థ భావనం
అదియే కదా ! ఆత్మ భోజనం ॥ఓమే॥

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స(40=00), వేదాలలో జలచికిత్స (20=00), వైదిక క్రాంతి పథం(15=00), అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము(15=00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణి స్త్రీ) (20=00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (15=00), గర్భాధాన విజ్ఞానము (30=00), మావన ధర్మము (10=00), అశ్వినీ దేవతలు(20=00), సంధ్యావందనము-వైజ్ఞానిక సమాలోచనము(20=00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30=00), గంగాధర శివుడు (5=00), గోమాత (30=00), గాయత్రీ విజ్ఞానం (50=00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60=00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (4=00), దైనిక అగ్నిహోత్ర విధి (4=00), మన ఇతిహాసం(70=00), మన వేదశాస్త్రాల పరిచయం (50=00), చతుర్దశ భువనములు (10=00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10=00), యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8=00), వైదిక వివాహ వైశిష్ట్యము (8=00), ధర్మవీర్ పం. లేఖరాం(3=00), మహర్షి మనువుపై విరోధమెందుకు (3=00), వేదాలలో అప్సరస గంధర్వులు (2=50), యజ్ఞోపవీత వైశిష్ట్యము(2=00), లక్ష్మీసూక్తము (2=00), శాంతిప్రార్థన (2=00), దిగ్రేట్ గాయత్రీ(2=00), వైదిక అర్థనీతి (2=00), బ్రహ్మచర్య విజ్ఞానము (15=00), శ్రీ దయానంద హృదయము (12=00), స్వరాజ్యసంగ్రామములో ఆర్యసమాజము(8=00), సత్యధర్మవిచారణ(6=00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10=00), మరణానంతరం జీవుని ప్రయాణం (40=00), ప్రణవ స్తోత్రము (10=00)

Gayatri Series : 51

**PRANAVA STOTRAMU** Rs. 10/-




**'ఓ3మ్ క్రతో స్మర'** - యజుర్వేదం (40-15)

ఓ కర్మశీల మానవా ! పరమేశ్వరుని ముఖ్యనామమైన 'ఓ3మ్' నామముతో సర్వవ్యాపక ఏకేశ్వరుని స్మరింపుము.

**శ్లో॥ అకారం చాప్యుకారం చ మకారం చ ప్రజాపతిః ।**
**వేద త్రయాన్నిరదుహద్ భూర్భువః స్వరితీతి చ ॥**

- మనుస్మృతి (2-76)

సృష్టికర్తయైన ప్రజాపతి పరమేశ్వరుడు అకార ఉకార మకారములను (ఈ మూడు అక్షరములు కలిసి ఓం అగును) మరియు భూః భువః స్వః అను పదములను మూడు వేదాలనుండి (ఋక్ యజు సామముల నుండి) పిండి సారముగా మన కందించినాడు.

**'తస్య వాచకః ప్రణవః, తజ్జపస్తదర్థ భావనమ్'**

- పతంజలి యోగ దర్శనం (1-27, 28)

క్లేశ కర్మ విపాకాశయము లను జీవుని బాధలు ఏమాత్రములేని శుద్ధుడైన పరమేశ్వరుని ముఖ్యనామము ప్రణవము. అంటే - ఓ3మ్ పదము.

యోగసాధనచేసి ఆత్మపరమాత్మల సాక్షాత్కారం పొందగోరేవారు ఆ 'ఓ3మ్' నామమునే అర్థభావనతో జపించటం సర్వ శ్రేష్ఠం.

Published by :

**Gayatri Ashram Trust**

12-10-586/6, Arya Samaj, Vyasnagar, Medibavi,
Warasiguda, Secunderabad - 500 061.
Cell : 9290604641,